# మనమందులు మన ఇంట్లోనే మనచేతుల్లోనే వుండగా ఇతరుల ఇతర దేశాల మందులు మనకవసరమా?

చంకలో మేకపిల్లనుపెట్టుకొని కొండంతా తిరిగి వెతకినట్లుగా మన ఇంట్లోనే మనకవసరమైన మందులన్నీ ఉంచుకొనికూడా మనం ఆసుపత్రులవెంట మందులషాపులవెంట పరుగులుతీస్తున్నాం. సొంతశక్తిని స్వంత ఇంటి పదార్థాలను స్వంత దేశ సంస్కృతిని స్వంత దేశ విజ్ఞానాన్ని విడిచిపెట్టి పరాయిశక్తికోసం, పరాయి పదార్థాలకోసం, పరాయిదేశ సంకర సంస్కృతికోసం పరాయి వికృత విజ్ఞానంకోసం పరుగులు తీసిన ఏ జాతి అయినా ఎప్పటికైనా బాగుపడగలుగుతుందా? మనకాళ్ళే మనకు ఆధారమవుతాయిగానీ పరాయికాళ్ళు మనకు ఆధారం కాజాలవు.ఈ సత్యం జీవితంలోని ప్రతి సందర్భంలోను వర్తిస్తుంది.ఏదేశప్రజలకు ఆ దేశవిధానాలే శ్రీరామరక్ష.

**ఇంటిల్లిపాదికి వంటిల్లే వైద్యశాల**



## ఎంత బాగుందబ్బా - శొంటి మురబ్బా

**తయారీవిధానం** :నారలేని పీచులేని మేలిరకమైన శొంటిని ఒక కేజీ తీసుకొని ఒక పరిశుభ్రమైన కుండలోవేసి ఆ కుండనిండా ఇసుక నింపి ఆఇసుకపైన రెండుపూటలా నీరుపోస్తూవుండాలి. వరుసగా ఇరవై రోజులపాటు ఈవిధంగా చేసిన తరువాత ఆఇసుకను తీసివేసి లోపలి సొంఠిని బయటకుతీసి శుభ్రంగాకడిగి ఆరబెట్టాలి. ఆరినతరువాత వెండికాడతోగానీ, ఇత్తడికాడతోగానీ సొంఠికొమ్ములపైన రంధ్రాలు పొడవాలి. తరువాత వేరేపాత్రలో ఒకకేజీ తేనె ఒకకేజీ మంచినీరు కలిపి బాగా కలబెట్టి పొయ్యిమీదపెట్టి చిన్నమంటపైన మరిగిస్తూ నీరు ఇగిరిపోయి తేనెపాకానికి రాగానే రంధ్రాలుపొడిచిన సొంఠిని అందులో వేసి పాత్రనుదించి చల్లారిన తరువాత ఆమొత్తం పదార్థాన్ని ఒకజాడిలో భద్రపరచుకోవాలి. ఇక్కడ తీసుకోవలసిన జాగ్రత్త ఏమిటంటే సొంఠి ముక్కలు తేనెలో వేసినప్పుడు ముక్కలన్నీ తేనెపాకంలో మునిగి వుండే టట్లుగా చూసుకోవాలి. ఇదే సొంఠి మురబ్బా.

**వాడేవిధానం** : రోజూ రెండుపూటలా 5గ్రా॥ మోతాదుగా పెద్దలకు ఒకటి లేక రెండుగ్రాముల మోతాదుగా పిల్లలకు ఆహారానికి అరగంట ముందు సేవింపచేయాలి.

**ఉపయోగాలు** : ఇలా ప్రతిరోజూవాడుతుంటే పై పొట్టలోను, కిందిపొట్టలోను అధికంగా వుండే అతివేడిని తగ్గించి శరీరానికి అవసరమైనంత వేడిమాత్రమే పుట్టిస్తూ మూత్రాన్ని సాఫీగా జారీచేస్తూ కఫజ్వరాలను అణచివేస్తూ శరీరానికి అమితమైన బలాన్ని కలుగ జేస్తుంది.



## నపుంసకత్వంనుంచి - పుంసత్వానికి

**తయారీవిధానం** : నీరుగొబ్బిగింజలు, ఏనుగు పల్లేరుకాయలు, అతిమధురం, దూలగొండిగింజలు, అశ్వగంధదుంపలు, శతావరివేర్లు, అతిబలవేర్లపై బెరడు, వీటిని ఒక్కొక్కటి 100గ్రా॥ చొప్పున తీసుకొని విడివిడిగాదంచి జల్లించి అన్నికలిపి పలుచని నూలు బట్టలో వస్త్రఘాళితం చేయాలి.

ఆతరువాత ఆచూర్ణాన్ని ఒకకళాయిలోపోసి కొంచెం ఆవునెయ్యివేసి వేయించాలి. ఆ తరువాత పటికబెల్లంపొడి 1400గ్రా॥ ఆవుపాలు ఏడులీటర్లు కలిపి వేరేపాత్రలోపోసి పొయ్యిమీదపెట్టి చిన్నమంటపైన పాకం వచ్చేవరకు మరిగించి ఆపాకంలో పైనతయారైన చూర్ణాన్ని బాగాకలిపి పాత్రను దించాలి. పదార్థం పూర్తిగా చల్లారి తరువాత రేగిపండంత మింగడానికి అనుకూలంగా వుండేవిధంగా మాత్రలుచేసి ఆరిన తరువాత గాజుపాత్రలో నిలువచేసుకోవాలి.

**వాడేవిధానం** : ఈమాత్రలను మొదలు పెట్టే ముందు సుఖవిరేచనానికి ఔషధం తీసుకొని పొట్ట శుద్ధిచేసుకోవాలి. ఆ తరువాత మొదటిరోజు ఒకమాత్ర రెండవరోజు రెండుమాత్రలు మూడువరోజు మూడు మాత్రలు మంచినీటితో పరగడుపున సేవించాలి. నాలుగవరోజునుండి మూడుమాత్రల మోతాదుగా ప్రతిరోజు సేవిస్తూండాలి.

**ఉపయోగాలు** : ఇలా ప్రతిరోజూవాడుతూ బ్రహ్మ చర్యం పాటిస్తుంటే 40 నుండి 100 రోజులలో శరీరం లో క్షీణించిన వీర్యధాతువు తిరిగి సమృద్ధిగా ఉత్పన్నమై దేహానికి పుష్టికలిగి నపుంసకత్వం హరించిపోతుంది.

**శిలాజిత్ భస్మం రెండు చిటికెలు సేవిస్తుంటే కడుపుమంట తగ్గుతుంది.**